# ఆశీర్వాదము

ఆయుష్మంతులయిన రామకృష్ణ కవులకు ఆశీర్వాదము.

మీ 'శంఖారావాన్ని' సాంతంగా చూచాను. సోదరాంధ్రుల పట్ల మీకుగల ప్రేమాదరాలు, ఆవేదన మెచ్చదగ్గది. కలతనిద్రలో కలలుకంటూ కాళ్ళుసాచిన తెలుగువాడు లేచి, నడుంకట్టి నడిస్తే మీశంఖారావం సార్థక్యం కాకపోదు. కాహళాలు కదనభేర్లే యనుమానించా యంటారు పెద్దలు. నవయుగోదయమైంది, రాష్ట్రమంది చాపుల్లోకి వచ్చిందిగనుక, ఆయనుమానాలకెడం లేదని నాఆశ

పసరుబ్రాయపు కదుష్ణరక్తంతో కదలివచ్చిన మీకవిత్వం కమ్మగానున్నది. ఇట్టి వధూరత్నాన్ని వరించిన కవిబ్రహ్మను కట్టిడిబ్రహ్మ కబళించి ఆంధ్రుల కన్యాయంచేయడం శోచనీయం.

గుంటూరు,<br>14–11–'49.

జి. జాషువ.

చేతః పద్మములన్ భజించెదము, సౌశీల్యంపుఁగాణాచి, భా
షాతత్త్వజ్ఞు, మహాంధ్రకావ్య ఘటనాచాతుర్యధౌరేయు, వి
ఖ్యాతైశ్వర్యు, వధానశేఖరుని, సంస్కారార్ద్రభావాత్త వి
ద్యోతున్, సద్గురుచంద్రు, వేంకటకవీంద్రున్ గొండవీట్యన్వయున్!

# కృతిస్వామి

శంఖారావము స్వీకరింపుము కవి
స్వామీ! సదా సత్కళా
ఖేంఖాణాగ్రసరమ్ము నెక్కి దశది
గ్వీధుల్ విడంబింపఁగాఁ
బ్రేంఖత్కేళిఁ జరించు తావక జయ
శ్రీకిన్ యశశ్శ్రీ కుష
శ్శంఖారావముగున్ ద్వాదాశిషము లీ
చందాన మాకబ్బెడిన్.

బ్రహ్మణ్యుండవటంచుఁ దెచ్చితిమి దే
వా! కాన్కఁగా సత్కళా
బ్రహ్మాండంబు సృజించు నీదురసిక
స్వాంతంబు మెప్పింతురే
జిహ్మస్వాంతులు? కాని భక్తులకృతి
శ్రీమత్త్వమంచున్ "కవి
బ్రహ్మ!" నిర్భయవృత్తికై తిమిఁక సం
భావింపుమస్మత్కృతిన్.



ఈవు కృతీశ్వరుండవయి
తేని మదీయ భవమ్ము సార్థక
శ్రీవిభవమ్ము కౌనని, వి
శిష్టత కౌనను నింతుకోర్కెమీ
పావన పాదపద్మముల
పాలికిఁ దెచ్చితిమయ్య! కబ్బపుం
బూవును మీపదార్చనలఁ
బ్రొద్దులుపుచ్చఁగ నిమ్ము మమ్మిఁకన్.

కృతిస్వామి

మాకృతులన్ని మీపద స
మర్చన కర్పణసేతుమీశ్వర
శ్రీకృతిగానిదంతయును
జిత్తములం దలపోయ మెందఱో
మీకిడు కాన్కలున్నను స
మీహితబుద్ధులొసంగుదాని ప్రే
మాకలనన్ గ్రహింతురు మ
హాత్మ! పదింబది చెప్పనేటికిన్.

*

కృతియొకఁడిచ్చెఁ దిక్కనకుఁ
గేతన మీరల తిక్కయజ్వయై
క్షితి పొగడొందినారలల
కేతన పాద పరాగ లేశమే
గతినగువార మేము! అల
గౌరవ భారత భారతీపతి
ప్రతిముని మిమ్ముఁగొల్చి భవ
బంధము లూడ్వఁదలంతు మింతకున్.

# శంఖారావము

తల్లీ! నీనుడులాలకించి రసవత్సాహిత్య సౌహిత్యసం
పల్లోలాత్ములమై భజించుటకు నోపన్ జాలకున్నార మ
ద్వల్లీలన్ దనియించు మాంధ్రకవితోద్యానంబునన్నేఁడు సం
ధిల్లెన్ స్వేచ్ఛకళాతపస్విని నమస్తే! నిస్తులోజస్వతీ!

స్వాతంత్ర్యమ్ము దొరంగమేమనుచు విశ్వంబెల్ల మార్మ్రోగఁగాఁ
బూతాత్ముల్, మహనీయులున్, త్రిభువనీపూజ్యుల్, మహాత్యాగులున్
దాతల్, తండ్రులికెంద తెందటో మహాధర్మ ప్రపూతాత్ములై
ప్రాతస్సంస్మరణీయులైరి తము సంభావింతు మశ్రాంతమున్.

మతభేదమ్ములుమాన్పి యెల్లెడల సామ్రాజ్యాతికాంక్షాగ్ని సం
హతి చల్లార్పియు, భారతీయులకు సత్యాహింసలన్నేర్పి భూ
నుతులం గైకొని, పూజనీయుఁడయి మన్నన్మిన్ను వాపోవఁగా
హతుఁడైపోయిన శాంతిదూత నిదలో ధ్యానింతు మెల్లప్పుడున్.

సారాచారవిచార! ధీరతమెయిన్ స్వార్థమ్ము పోనాడుచున్
గారాగారములందు గ్రమ్గితివి, పక్షాజాతి పాశ్చాత్యులన్
బోరాటమ్మున నుగ్గుఁజేసితివహో! పుణ్యాత్మ! జోహార్లు, నీ
వేరాజ్యమ్మిపుడేలుచుంటివో కొ! తండ్రీ! బోసువీరాగ్రణీ!

భరితజ్ఞాన్మస్థలి భావిసౌఖ్యపథమున్ బల్మారు భావించి యె
ల్లరకున్ న్మెలొనరింపఁబూని సుఖమెల్లన్వీడి శాంతమ్ముగాఁ
బరరాజత్వమువాపి సద్యశము సంపాదించి మంత్రీంద్రుఁడై
ధరనేలందొరకొన్న పండితుని బ్రస్తావింతు ముద్యన్మతిన్.

పవఁలున్ రేలను చెంచకెల్లపుడు నిస్స్వార్థస్వభావమ్మునన్
స్తవనీయాన్వయులై, మహాత్ములయి, క్షేత్రశ్రీలలో కానకున్
జవముం జీవము వోయు కర్షక మహాసంఘాంఘ్రియుగ్మంబు మ
త్కవితారీతుల సంస్తుతింతుము నమస్కారమ్ము తోరమ్ముగన్.

జాతిసముద్ధరింపఁగ నృశంస విభుత్వము రూపుమాపఁగా
నీతిని బెంపఁగా సకలనీరధివేష్టిత విశ్రుతోరు భూ
మీతలమెల్ల నేలితి వమేయ పరాక్రమ మొప్పఁ దొల్లి, నా
ఖ్యాతిని విస్మరింతువటరా! మొనగాఁడవు లెమ్ము నిద్దురన్.

స్వాతంత్ర్యోద్యమ దీక్షలన్ మసలుచున్ ప్రత్యేక రాష్ట్రస్థితి
పూతఖ్యాతులు స్వీయసంపదల సంపూర్ణంబుగానొడ్డి, వి
ఖ్యాతింగాంచిరి, తద్యశస్సును సదా కాపాడుచున్ దుర్గుణా
న్వీతుల్ చెప్పెడి బూటకంబులవెసన్ ఛేదింప లెమ్మాంధ్రుఁడా!

వన్నెల్యాసులు దారివట్టఁ దెలుఁగుం బల్లెల్లఁ బ్రాల్మాలె, వి
చ్ఛిన్నంబయ్యెఁ బవిత్రగౌరవ ముపేక్షింపంగ న్యాయంబె? తె
ల్గన్నా! స్వార్థపథంబువీడి శిథిలంబై యున్న యుష్మత్ప్రభా
వౌన్నత్యంబడె నిల్పరమ్మిఁక స్వరాష్ట్రాందోళనప్రక్రియన్.

సస్యశ్యామల, రత్నగర్భయగు దేశంబంతయున్నేఁడు దీ
నాస్యచ్ఛాయలతోఁ గృశించెనకటా! యస్పృశ్యతాదోషమున్
దాస్యంబున్నిలఁబెట్టి నాయకులు నానామార్గముల్ ద్రొక్కి రా
లస్యంబేలర? లేచిరమ్మిప్పు డనల్పప్రజ్ఞ దీపింపఁగన్.

మోసంబన్నిటఁజేసి నాయకులు సంపూర్ణాంధ్రరాష్ట్రమ్ము నే
వో సాకుల్ పచరించి మన్నెదరుసుమ్మా యాంధ్రవీరాగ్రణీ!
వాసుల్ వన్నెలు నేటిపాలయినవప్పా! కూటికిం గుడ్డకున్
గాసింజెందిన తెల్గుబిడ్డలగతుల్ గంటే నిరాలస్యతన్.

వ్యర్థంబై చనెఁ బడ్డకష్టమొకఁడుం బాటింపడయ్యాయతిన్
స్వార్థంబా! తలమీఱిపోయె, జనులం బాధించు విద్వేషులన్
బ్రార్థింపన్ దగదయ్యయో! తెలుఁగుబిడ్డా! కర్మవీరుండవై
దుర్థశల్ బెగడన్ స్వరాష్ట్రమున కుద్యోగింపు ముద్యద్గతిన్.

పట్టాభీ! వలభాయిపటేలు మఱి జవ్హార్లాలు నీయగ్రణుల్
కట్టా! యక్కటికంబులేక మనకుం గంపంబుగల్పించి రి
క్కట్టుల్ దీర్చెడివారులేరు, తెలుఁగుం గళ్యాణరాష్ట్రమ్ముకై
పట్టుంబట్టుము చెట్టలందొలఁచుమ బ్రహ్మాణ్యముం బెట్టుచున్.

అల పాశ్చాత్యుల గుండు దెబ్బలకు మాయాంధ్రుండె అర్పించినన్
ఫలమేమున్నది? తెల్గువీరుఁడొకఁడైనం గద్దెపై లేఁడుగా!
పలుమారున్ బరికించియెంచి వివిధోపాయమ్ము లంబూని, యు
జ్జ్వల భవ్యాంధ్ర మహీమతల్లికి మనస్వాస్థ్యమ్ము సేకూర్పరా!

భువన విజయ సభా భవన మండనమైన
యష్టదిగ్గజ కేళి యలరెనిచట
ఫ్రెంచి బూచీల జయించి మించినవీర
బొబ్బిలి బిడ్డలు పుట్టిరిచట
ఖండఖండాలఁ బ్రఖ్యాతివహించిన
పలనాటివీరులు వెలసిరిచట
భారతీయాఖిల వాఙ్మయ రేఖల
పటిమదీరిచి దిద్దఁబడినదిచట

ఖ్యాతిగాంచిన మా తెల్గుగడ్డ నేఁడ
అరవవారల చేతిలో నణఁగియుండె
సైఁపలేమింకఁ దెలుఁగుల శ్రమలదీర్ప
ఖడ్గముధరించి మున్ముందు కదలుమన్న!

అల్పత్వమున నున్న ఐర్లండు రాజ్యమ్మె
స్వపరిపాలన మొంది సౌఖ్యపడఁగ
జనసంఖ్యలోఁ దక్కువన నొప్పు స్కాట్లండు
స్వాతంత్ర్యజలధి మజ్జనములాడ
విస్తీర్ణమునయందు వెనుకబడ్డ కళింగ
దేశమ్మె స్వేచ్ఛమై దేలుచుండ
విలసితంబగు తెలుఁగుల భూరిభాగ్యమ్ము
లరవల పెట్టెలం దడఁగియుండ

కటకటా! సైఁపలేమిట్టి కార్యములను
శ్రమలకోర్చియు భూరికష్టములఁ బొంది
మన విశాలాంధ్రరాష్ట్ర సంపాదనమున
ధీరచిత్తతఁ దరలరా! తెలుఁగుబిడ్డ!

ధీరుఁడవై స్వరాజ్యమును దెచ్చి యశస్సుగడించునీవు నే
పారఁగ నాంధ్రరాష్ట్రమునకై విలపింపఁగ నేల? ప్రేముడిన్
భారతజాతి భారమొగిఁ బాపెడివారిఁక లేరు, లేరు! భూ
భారము మాన్పి శాంతి యొకపట్టునఁ బాదుకొనన్ దలంపుమా!

మన దేశముననున్న "మాంటేగు" ప్రభువర్యు
నాంధ్రరాష్ట్రము నాంధ్రులడిగినారు
స్టేటుకౌన్సిలునందుఁ జేరి కేంద్రములోను
దెలుపఁడే జోగయ్య తెలుఁగుకోర్కె
శాసన సభయందు సామర్ధ్యముంజూపి
యాంజనేయులు భాగమడిగినాఁడు
గాంధితో గిరియు నింగ్లండుచేరెడువేళ
తెలుఁగురాజ్యమ్ము నర్థించినాఁడు

అడుగుచున్న మా మనవులు తుడుపు వెట్టి
సింధువారికి రాష్ట్రముఁ జేర్చినారు
అకట ! మనవారు చేయునన్యాయములను
తెలిసికొనలేదె యిసుమంత తెలుఁగుబిడ్డ!

తమరెన్నాళ్ళు స్వరాష్ట్రహీనముగ నీ దాస్యంబునందుందురీ
శ్రమలం జెందుచిఁకన్ స్వయంకృషి విశేషవ్యాప్తి రాష్ట్రోద్యమ
క్రమదీక్షాగతిఁబూనరేమిటికి ? దీక్షాకంకణంబూద్తురా ?
సమయంబీయదిగాన మేలుకనుఁడా సామర్థ్యముల్ చూపఁగన్.

పరవీర్యలుంటాక పౌరుషోజ్జ్వలుఁడైన
బాలచంద్రుండు మా పజ్జవాఁడు
నిర్వక్ర విక్రమనిపుణుఁడౌ శ్రీకృష్ణ
దేవరాయలును మా తెలుఁగువాఁడు
కండలంగదలించి కదనభూమిని నిల్చి
కాటమరాజు మా కలనివాఁడు
దాస్యశృంఖలల విదారింప దొరకొన్న
మాదన్న మా పంచ మఱగువాఁడు

సకల రాజులగుండెలు జల్లుమనఁగ
ఖ్యాతి గాంచినవారు మా జాతివారు
అహహా! యేమనిచెప్పెద మాంధ్రమహిమ
దేశ దేశాల విపుల సత్కీర్తిగాంచె.

నీ సుఖసంపదల్ సిరులు నీ యభివృద్ధినిగాంచి యోర్వలే
కీసువహించి వాదములకీల్చుచుఁజెన్నపురాన నీవు నే
వీసములేదు భాగమని వెట్టితనమ్మున వాగువాని సా
వాసము వద్దుబాబు! మనభాగము లాగుకొనుండు నేర్పునన్.

చెల్లని పొల్లువాదములచేత నె మోస మొనర్పఁబూని ని
న్నెల్లరి పాలొనర్ప సమయంబని యెంచిరి, ఆంధ్రపుత్రకుల్
మల్లరణానుకూలు రరిమర్దనవిక్రమ శౌండులంచు రం
పిల్లుచు చాటుమాంధ్ర జయభేరి దిశల్ వగలంగ వాంధ్రుఁడా !

అడిగితి మాంధ్రరాష్ట్రము నయానఁగుతంత్ర విధాధురంధురుల్
ముడివడనీయకుండి రదెపో తమిళుల్ పచరించు మాయలన్
గడవఁగలేక యుండిరది గాంచుము త్రెంచుము తన్మతోద్ధతిన్
బిడుగువలెన్ ద్వితీయ భుజవీర్య విశిష్టతఁజూపు మాంధ్రుఁడా !

అందని మ్రానిపండ్ల కొఱకక్రులు చాపుచుఁజెన్నపట్టణం
బందుకొనంగఁజూడ మరియాదయె ? యర్వాలకెందుకున్, సెబా
సందురటయ్య విజ్ఞులిది యాత్మపరీక్షయె యాంధ్రజాతి కీ
సందడికయ్యమందు జయశంఖము నూదగదోయి యాంధ్రుఁడా !

స్థిరమై నేఁటికిఁగానుపించినది గాంధీయోద్యమోద్యత్ప్రభా
వ రయం బింతటనైనఁ జేకలిపి భావమ్మొక్కటింజేసి స
త్వర మీరాష్ట్రఫలాప్తికై కుటిల రాద్ధాంతమ్ములన్మాని సు
స్థిర సిద్ధాంతముఁబూని వేఁగదలి వాసిన్నిల్పుమో యాంధ్రుఁడా !

అమితానందముగల్గె నాంధ్రులకు సౌఖ్యంబౌనంటంచట్లు " ధార్ కమిటీ " వారి నివేదికే మసల దుఃఖాంభోధి నోలార్చె నీ శ్రమలింకెన్ని దినంబులుండునో ? స్వరాష్ట్రంబెన్నఁడోయీ? విచారములో ముంపదె ! నాయకత్రయము కార్యంబిప్పుడాంధ్రాగ్రణీ !

నాయకత్రయమున్ సల్పు నాటకమ్ము
తెలిసికొనఁజెల్లు నాత్మలఁదెలుఁగువాఁడ
తెలుఁగు వీరుల రాజ్యము నిలుపుకొనుటకు
నడుముకట్టితివో ! మేలు పడెదవన్న !

బ్రిటను గుండెలు వ్రక్కలై బీటవాఱ
ధీరులనిపించుకొనలేదె తెలుఁగువారు
తలలువంపఁగ నేఁటి యాంధ్రులకుఁదగదు
కదలి రండయ్య ! మదరాసు వదల వలదు.

చెన్నపురి విషయమ్మంత చెప్పరాదు
కోరపుట్టిని భాగంబు కోరరా ద
టంచు చెప్పుచునుండ్రు నాయకులు నేఁడు
అకట ! మన వారి న్యాయ మిట్లయ్యె ! దుడికి.

పదవులకెక్కి యమాత్యులు
వదలిరి నిజరాష్ట్ర వాంఛ స్వార్థపరతచే
మదరాసు మనదెయంచును
పదరా ! తెలుఁగన్న చెన్నపట్నముపైకిన్

పట్టాభిగారి ప్రకటన
కట్టా ! పడగొట్టె రాష్ట్ర గౌరవమెల్లన్
బట్టిన పట్టాగి పీడక
నెట్టన యత్నించి తెమ్ము నీ రాష్ట్రమ్మున్

ఎన్నేండ్లాయెనొ ! స్వేచ్ఛ లేక ? మనమింకెన్నాళ్ళు కూర్చుంట ? తె
ల్గన్నా ! జంకెద వేల ? నీ మహిమ ధైర్య స్థైర్య శౌర్యాదులన్
ఎన్నంగాఁదరమా న ? వీరులకు నీవేసాటి రారమ్మికన్
చెన్నాపట్నము మాదియే యనుచు నీచేయెత్తి సాటింపరా !

లెమ్మా యాంధ్రుఁడ వేగమె
కొమ్మా శపథంబు ప్రజల కోర్కెలుదీర్పన్
దెమ్మా రాష్ట్రము తెలుఁగుల
సొమ్మంతయు నీవు నిలుపఁజూడుము సరగన్.

బీదల్ వందుర నెత్తురుపీల్చి ధనికుల్ పెంపొందుచున్నారు నేఁ
డీ దారిద్ర్యపిశాచి తాండవము లేమీ! భీతిక్రేళ్ళుబెట్టెడిన్
నీదేశానకు జాతికి న్నవనవోన్మేషమ్ము చేకూర్ప నీ
వా దైన్యమ్మిఁక వీడి లెమ్ము తెలుఁగన్నా! రాష్ట్ర సంసిద్ధికై.

నైజామందుఁ దెలుంగుబిడ్డలకు నానాకష్టముల్గల్గె నేఁ
డీ జాతీయ పతాకనీడలనె యింకెన్నాళ్ళో వేధించు శం
కాజాడ్యంబు లడంచువీరు లెవరుం గాన్పింపకున్నారు ని
ర్వ్యాజప్రేమ స్వరాష్ట్రమున్ గడనచేయంబూనుమో యాంధ్రుఁడా

పడఁతులుమానభఁగమున బ్రాణములొడ్డిరి భూరికష్టముల్
గుడుచుచు సజ్జనావళులు గూలె నిజామిటు నేఁడు నిల్వుదో
వుడులకు స్థానమైయెసఁగఁ బోల్పరిచూతువ? దుర్జనాళిపై
నడుముబిగించి ఖడ్గము ఝుణంఝుణమై జళిపింపు మాంధ్రుఁడా?

అబ్రహ్మణ్యమటంచు రైతులు రవంతాధారమే లేక దుః
ఖాక్రాంతింబడిరయ్యయో! విధికృతంబట్లుండెనా యేమి? నేఁ
డీ బ్రహ్మాండ విపత్తులం దునుము మాయీ! క్షాత్రవిస్ఫూర్తితో
ఆబ్రహ్మాదులువచ్చి యడ్డినను లేరా! నారి సారింపరా?

అన్నలుదమ్ములే పదవికాసలఁజెందుచు గ్రుద్దులాడు చ
య్యన్నతి గోలుపోవుచునె యుండిరి వీరటె నాయకోత్తముల్ !
యెన్నఁడువారు నీతిపథమెం తురొ ? నీవయినంగడంగి యీ
యున్న విభేద భావముల నోర్పున దిద్దుము తీర్పుమాంధ్రుఁడా !

జీతము బత్తెమున్విడచి జీవితమంతయు ధారవోసి చే
సేఁతల నాంధ్రరాష్ట్ర ఫలసిద్ధినిబొంద నుపన్యసించి వా
రే తలలొగ్గి రిప్పుడతిహీన పథంబున కర్థబద్ధులై
ఓ తెలుఁగన్న ! యిట్టియెడనుందువె మిన్నులు వట్టి చూచుచున్

ఆ యాంగ్లేయుల సాంప్రదాయములు శ్లాఘ్యంబౌనటంచెంచి యే
సాయంబైనను జేయ లేదు ప్రజకున్ స్వార్థంబుచే నాయకుల్
వ్యాయంబున్విడి దేశనాశమగు నానా చేష్టలన్ జేసి రీ
హేయంబైన స్వలాభ కాంక్షలనుమాయింపం బ్రయత్నింపుమా !

అత్యుచ్చస్థితి సుప్రతిష్ఠ చెడి హా ! హా ! యేమిదుఃఖాబ్ధిలో
నిత్యోన్మజ్జనమాడు చుంటివిఁక నీ నేర్పంతియుంజూపి స
త్కృత్యంబుల్ పొనరించుచుండి నిజజాతీయైక్యముంగూర్చి యా
న్నత్య ప్రోజ్జ్వల కీర్తుల న్నిలువుమన్నా ! కర్మ వీరుండవై

పరులన్ హింసలుపెట్టి జీవనసుధాస్వాదంబుగావించు దు
శ్చరితుల్ ఖద్దరు దుస్తులందొడిగి దేశంబందుఁబెద్దన్నలై
నిరతంబున్ బహు భోగభాగ్యములతో న్బంపొందుచున్నారు మ
ష్కరులన్ డీకొన వేగమేకదలి నీ శంఖంబు పూరింపరా !

నిరతము పేదలంబిడికి నెత్తురుద్రావి, వినోదమొంద సా
గిరి మన షాహుకార్లు, పరికింపర వారలబారినుండి నే
కరణిని నేఁబరిశ్రమల కార్యకలాపము మార్పకున్నఁ జా
డర యిఁక లోకమేక్రియ నెడాటము సైచునో ? యాంధ్రసోదరా.

ధనికుల చెంతఁజేరి కడుదైన్యముతో బహుకాయకష్టముల్
గనుచు శ్రమంబులొందినను కట్ట ! దరిద్రునిపొట్టనిండ దా
యె ననుజులార ! యింకయిన కృత్రిములౌ ధనికాళినుంచి చ
య్యన మన బీదసాదలను సాదరమొప్పఁగఁ బ్రోవరాదయా !

భారతజాతి గుండియలు భగ్గనమండగఁజేయునట్టి యీ
ఘోర నిషిద్ధశాస్త్రములకు న్విలపించుచు నూరకున్న నీ
భారతదేశ మింకెటుల బాగుపడున్ దెలుఁగన్న సంఘమున్
జేరి మహోద్యమంబుల సృజింపుమ దేశమునుద్ధరింపుమా !

నశియింపలేదింక నానాటికిని గూడ
లంచగొండి తనాల లంకెపీట
వెనుకాడలేదింక విద్యానిధులయందు
బ్రిటను భాషలకున్న పీకులాట
తగ్గిపోలేదింక ధనిక మదాంధుల
చీఁకటిబేరాల ప్రాఁకులాట
అణగారలేదింక నవమానకరమైన
"గ్రూపుల"లో నున్న గ్రుద్దులాట

భాపురే నేఁటి స్వాతంత్ర్య ఫలితమిదియ!
కుమిలి కుళ్లాడువారి కష్టములుదీర్పఁ
గుటిల ధనమదోన్మాదుల కుట్రగూల్ప
నడుముగట్టుడు వేగ సన్మాన్యులార!

పెద్దదియైన యీ భరత వీరవిలాసిని విద్యలేకయే
ప్రొద్దుతపించు నాయకులు పూనరు లోపమడంప దీనికై
పెద్దలు పిన్నలుంగలసి వేయువిధమ్ముల సేవసల్పనా
విద్దియ దేశమందు నభివృద్ధికిఁ దెమ్మిఁక దెల్గుసోదరా!

చదువులులేక కార్మికులు సర్వ పరాభవ మొందుచుందురా
పదలకు మేర లేదు మనపాలిట మిత్రులు బీదవారలీ
యదనున దారిఁజూప నదియంతయు భంగముఁజేయఁ బెద్దలే
మొదట నుపక్రమించిరిది మోసము దోసము కాదె యాంధ్రుఁడా

మతభేదమ్మను కాలసర్పమతి బీష్మంబౌ ఫణాభోగము
ద్ధతినాడించెడి నైక్యగారుడము మంత్రంబున్ వెలారించు బా
ధ్యత్వ సంపూర్తిగనుండె నీపయిని నేఁడన్యాయ దోషమ్ములన్
హాముథంజేయఁ గడంగు మిప్పుడ వయస్యా? ధర్మబద్ధుఁడవై.

అలజడిపుట్టి యట్టుడికినట్లుగు బాగుబలంబు కారు లీ'
యిల బ్రబలెన్ మహామహులికిట్ల లసత్వము పూనుటొప్పునే?
ఎలపయి కాలుద్రవ్వి ధ్వజమెత్తి ధనాంధులబట్టి వారి దో
ర్బలమునడంచి యాతనలఁబాపి సుఖింపుము సోదరాగ్రణీ!

పూతచరిత్రులై ప్రజల పోషణ చేయుటమాని స్వార్థులై
లేఁతదనమ్ము చూపిరి భళీ! అధికారులకిట్టి, చెయ్దముల్
నీతియె? ద్రోహబుద్ధులవనిన్ మితిమీరిరి వారిద్రుంచి ప్ర
ఖ్యాతి గడింపుమా యిఁక జగా మొనగాఁడవు సోదరాగ్రణీ!

నీవె యనూరుమన్న నవనీ వలయమ్మది తల్లక్రిందులై
పోవును దుష్టులెల్లఁ జెడుపోకలపోదురు నీతినిష్టలున్
చేవదొలంగిపోవునతి శీఘ్రముగా భవదీయజాతికిన్
జీవముపోసి మేల్కొలిపి శ్రీయొసలార్పుము సర్వదాభువిన్.

సోమరిపోతులై ప్రజలసొమ్ముహరించుచు మాయమాటలన్
సేమముగూర్చువారివలెఁ జేసుచు నైక్యముపాడుసేయుచున్
బూమెలుచెప్పి యిబ్బరతభూమి వినాశమొనర్చువారలన్
నేమముమైనడంచి యవనిన్ బరిరక్షయొనర్పు మన్నిటన్.

మాయలుపన్ని జాతికవమానము గల్గఁగఁజేయఁబూని త
న్మాయల మంత్రులన్ బ్రజల మన్ననకై కొని యున్నవారలో
యీ యనుమానమేల ? పొలియింపుముద్రోహుల జాతియాతవల్
బాయఁగఁజేసి, సంతసముపండ సుఖింపుము సోదరాగ్రణీ !

పదవుల కాసఁజేసి మనభారతదేశ పవిత్రకీర్తి సం
పదల గఁటంచి కొంతవడి పైపయిరంగులుచూపి తిన్నఁగాఁ
బదవుల చేయిచిక్కఁగనె భావము చంచలమై స్వలాభ సం
పదకయి జాతికంత కవమానమొనర్చిరి సోదరాగ్రణీ !

శత్రువు వాకిటన్నిలచి శౌర్యము గ్రక్కుచునుండ దేశముల్
మైత్రి దొరంగి కక్షల సమాంతముగా దిగ్రమింగుచుండ నే
మాత్రము చింతఁజేయక యమాయకరీతి మసంగ నొప్పునే?
క్షాత్రముచూపి శాత్రవుల కంఠ విలుంఠన మాచరింపుమా!

సతతముగి "గ్రూపులొ"డ గూర్చి సంచరించి
సంస్థలను జీల్చి చెండాడు చవటలుండ
దేశమేరీతి నున్నతస్థితికివచ్చు
ప్రస్ఫురద్గుణగణగేయ! భారతీయ!

సంస్థ కాత్మార్పణము చేయ సాహసించు
పురుషులేకొద్ది భారతభూమియందు
వారిమతికిని జంచలత్వమ్ము గలిగె
సౌఖ్య మెట్లబ్బు భారతజాతికిపుడు

న్యాయమున్నది ప్రభువులున్నారటంచు
భావమందెంచి వారిపై భారమిడఁగఁ
బ్రజల కొఱకే మహాత్ముఁడు పాటుపడెనొ?
అబ్బురముగాదె నేతల నిబ్బరమ్ము.

ఆతఁడె "ఏటుకూరి" కలశాబ్ధి సుధాకరుఁడిద్ది కావ్య కృ
న్నేత, కళాప్రపూర్ణుఁడు, వినిర్మల చిత్తుఁడు, సత్కవీంద్రుఁడున్
జాతి సముద్ధరింప ననిశంబు ప్రయత్న మొనర్చె, విశ్వ వి
ఖ్యాతి ఘటించె మా తెలుఁగుగడ్డకు భారత భాగ్యదాతయై.

భోగములుజ్జగింప పరిపూర్ణమనంబుల స్వేచ్ఛఁగోరుచున్
సాగి స్వతంత్రజీవనము చక్కఁగదిద్దుచు సజ్జనాగ్రణుల్
త్యాగులు పోల్చుచుండఁగుటిలాత్ములు గాంచి సహింపకుండిరిం
కేగతి సౌఖ్యమబ్బును మహీస్థలికిన్ మునుముందుసోదరా !

పరిధనముల్ హరించి కడుపారఁగ మెక్కుచుఁబట్టుపాన్పులం
బొరలుచు దేశభక్తతతిపోలిక నాటకమాడు వారిపై
కరుణవహింప సౌఖ్య మెటుకల్గును మానవకోటికింక, ము
ష్కరులగు శాంతిఘాతకుల గర్వమడంపుము సోదరాగ్రణీ!

అదిగో! స్వార్థజనుల్ నిరంతరము కయ్యాలాడు దుష్టాత్మకుల్
మదమాత్సర్యమనీషులాత్మకృత మాత్సర్య ప్రభావాద్యులీ
కదనాగ్రంబున నిల్చియుండిరి దిశాగ్రంబుల్ భయంబంద స
మ్మదమొందన్ మసిజేయుమయ్య కులసంబంధమ్ము లేకుండగన్.

మాఱె ప్రభుత్వము మాత్రమె
మాఱగ లేదందు బ్రజలమనసుల వేమో
ఏరీతి స్నేహమబ్బుమ
ఱేరీతిని సౌఖ్యమబ్బు నెఱుఁగఁదరమ్మే!

తగవులచే దేశమ్మదె
పగులుచు శాంతమ్మటన్న పోలికలే క
ల్లగచాట్లు పడెడి దేశము
తెగులు విధమ్మే మతిమ్ముదిట నదిసడలున్.

కులవిభేదమనుచు గొప్పవారలమంచుఁ
దొలఁగి తొలఁగినడచు దొరలుగలుగ
దేశమెట్లు గొప్పస్థితి గాంచఁగల్గునో ?
అప్రతిష్ఠ బొందుటగునుగాదె!

మతకక్షుల మూలమ్మున
నతులిత కీర్తిప్రకాశుఁడార్యవినుతుఁడా
మతిమంతుఁడు బాపూజీ
హతుఁడయ్యెను " రామ రామ " యనివినదగునే.

అవనిం జాతిమతాల పేరిడుచు హత్యాకాండ రేకెత్త సం
స్తవనీయంబగు భారతావనిని దగ్ధంబౌ సటుల్ చేరినా
రవివేళల్, మత మత్తచిత్తులు వయస్యా! వారి పొంగార్చుచున్
భవదీయ స్తవనీయ బాహుబల సంపల్లీలఁ జూపెట్టరా!

జెండాపట్టుచు "జై" యటంచుఁ బ్రజలన్ జెండాడి పీడించుచున్
గొండాడంబడుచున్న వారలుగదా! కోటీశ్వరుల్ మిల్లులన్
నిండన్ దిండికిలేక బీదలటు కన్నీర్గార్చుచున్ డొక్కల
జ్లెండంగట్టుచుఁ గుల్కుచుండిరిఁక మేమేమందు మీ మందులన్,

బుగిలి తపించు మానవులపోషణ చేయక సంతతమ్ము దె
ల్లగణిత భోగభాగ్యముల నందగ డెందము విందుచేసె, నే
పగిది దయారసమ్మొదవుఁ బాపపుజాతికి వారలెల్ల నీ
పగతురురా! జయధ్వజము పట్టుచు జాతిని నుద్ధరింతురా!

లంచంబీయనిచోఁ బని
కించిత్ సఫలంబుగాదు కృపలేమండన్
వంచించెద రధికారులు
సంచలనమ్మొదవె బ్రజల సాన్నిధ్యమునన్,

మామూలేదనిపల్కి లేదనిన "బొమ్మా! యిప్పుడేతీరెనా ?
నీ మూలమ్మునగాదె యీపని వృధానిల్చెన్ మరో రోజురా
పో, మాపాలి యముండవైతివని" యేవో నిందఁ సీక్షి ప్రజా
క్షేమమ్మారయఁకున్న వారలసలీ చేడ్పాటెటుల్ దప్పునో ?

దుర్విధిని నవ్వఁ జేపనితోడఁగాని
సారె సారెకుఁ గచ్చేరిఁ జేరి రేని
రేపురా, మాపురా యని త్రిప్పి త్రిప్పి
వారిఁ బీడించుచుంట గన్పడుట లేదె.

ఎవ్వరో పెద్ద "లాఫీసు" కేగినంత
శీఘ్రమె లేచి భక్తి కుర్చీలనిచ్చి
పనుల సమకూర్చికొనియాడఁబడుచునుందు
రద్ది యధికారులకును మర్యాదలౌనె ?

బీదలకుఁగాని డబ్బియబోదు మనసు
బొమ్మరిండ్లకు దద్వివాహమ్ములకును
లక్షలాదిగ విత్తమ్ము లక్ష్యమునక
ఖర్చువెట్టెడి భక్తలోకమ్ముగలదు.

స్వార్థరాహిత్య స్వభావాలచేఁ బ్రేమ
మించగా ప్రజల రక్షించువారె
ఔన్నత్యమున్వీడి యలమటిల్లెడు దేశ
భద్రతం గోరుచుఁ బరగువారె
శాంతి సత్యాహింస సమభావముల నొప్పి
యాదర్శజీవులై యలరువారె
మతములకొఱ కైకమత్యమ్మువిడి సంచ
రించువారల నిరసించువారె

స్వార్థమునుగోరి దేశశోభన మొకింత
దలపకుండ ముఠాలుగాఁ దారసిల్లి
పెనఁగులాడుచుఁ గక్షలఁ బెంచికొనుచు
దేశమును నాశనమొనర్పఁ దివిరినారు.

పనులకోపిక చూపక ప్రాలుమాలి
మందిసొమ్మున శాసించు పందలెల్ల
గోరి దేశమ్మదే పని కొల్లగొట్ట
భోగ భాగ్యమ్ము లేరీతిఁ బొందఁగలము.

తాతలును దండ్రులార్జించు ధనముచేతఁ
బ్రజల మన్ననలందిన స్వార్థమ్ముఁగోరి
నేతలై సేవవీడి దుర్నీతులగుచు
దేశ సౌభాగ్యముల ద్రొక్కిపెట్టినారు.

సరసముగ వస్తువేదియు దొరకదాయె
బీద ప్రజలకుఁగష్టాలు పెరిగిపోయె
"బ్లాకుమార్కెట్టు" దేశానఁబ్రబలిపోయె
మంచియనునది మనలోన మాయమాయె

అజ్ఞాయించుట పాడిగాదిపుడు ద్రోహాత్ముల్ దురర్థ్వానుగుల్
లజ్జన్వీడి చరించుచుండిరిఁక నిర్లక్ష్యమ్ము వేమాని లె
మ్ముమ్మజ్జీ చూడుము అందెక్కట్టుకొని యీ యున్నామదాంధులన్ని చులన్
బజ్జంజేరక యుండునట్లడవరా! భ్రాతగ్రణీ! యాంధ్రుఁడా!

అనుమానింపక చిన్నపెద్దల మహా హాంకార హుంకారతన్
జనసామాన్యుల ద్రోహచిత్తులదె దౌర్జన్యమ్ముగా ద్రోసికే
కనఁగా గుండెలు జల్లుజల్లనుచుఁ గంగారెత్తగాసాగె, నో
యనఘా! యాంధ్రకుమార! లెమ్మిఁక ప్రజాకాధ్యుండవై శీఘ్రమే.

పూటికి కేటికీ కటిక మానుషకోటిని మందలింప బీ
బోటులుదీటు చీఁకటులఁబో కుటిలాత్ములఁద్రుంచి జ్యోతివై
చాటు మఖండకీర్తిని బ్రకాంతి జగమ్మున భారతాంబ హృ
త్పేటికలో వెలుంగుము సుభిక్షముగా నిఁక సోదరాగ్రణీ!

శిథిలమై మొదలంట జీర్ణించిపోయిన
దేశసౌభాగ్య ప్రదీప్తికొఱకు
మత భేదముల నైకమత్యమ్ము బోనాడు
కుమతుల కైక్యముఁ గూర్చుకొఱకు
స్వార్థాభిలాషులై పరివిత్తమున్ ద్రోఁచు
దుర్మార్గులన్ వేగ దునుము కొఱకు
అధికారములకు నైయులజకి గల్గించు
దురితాత్ములం బారద్రోలు కొఱకు

రమ్ము లెమ్మాంధ్ర వీరబిరాన జాతి
కలఁగి మలఁగెడి దేశసంస్కరణ కొఱకు
స్వార్జితంబౌ స్వరాజ్యైక భాగ్యలక్ష్మి
చెదరిపోకుండ నిల్పికొమ్మదను గదిరె.

నీ జయలక్ష్మిఁగాంచి యవనీవలయమ్మది కప్పూరంపు నీ
రాజనమిచ్చి తీరుసుతరాముడు గొత్తగనీ ముద్రోహాలు లిం
కే జడవస్తువైన గదిలించిన నీదగు దేశభక్తియున్
దేశముపాటలై బరగుఁదెల్లమురాయిది సోదరాగ్రణీ !

మతివిహీనత మతమదోన్మత్తులైన
ప్రజల నిదురనుబాపు ప్రభాతభేరి
అంధకారమ్మునను బడి యలమటించు
దేశజనులకు విహిత సందేశమిదియె.



సిటీ ముద్రాక్షరశాల, గుంటూరు.